# ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము

బెజవాడ

(1860 సం॥ 21 వ ఆక్టు ననుసరించి రిజిస్టరు చేయబడినది)

## ఇరువదియైదవ సంవత్సర నివేదిక

## 1938-39



ప్రకాశకులు

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము – బెజవాడ

1939

# 1938-39 సం॥ పాలకవర్గము

అధ్యక్షుడు : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, యమ్. ఏ.
9 సుంకువారివీధి, ట్రిప్లికేను, మదరాసు

ఉపాధ్యక్షులు : శ్రీ దువ్వూరి రామకృష్ణరావుగారు, బి. ఏ.
వీరభద్రపురము, రాజమండ్రి
,, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు,
తెనుగుగుడి, విశాఖపట్టణము
,, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు,
323 తండియార్పేట, మదరాసు

కోశాధిపతి : శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు,
ఖద్దరుసంస్థానము, గుణదల, బెజవాడపోష్టు

కార్యదర్శి : శ్రీ పాతూరి నాగభూషణంగారు, డిప్. లిబ్.
సేవాశ్రమము - పెదపాలెము (వయా) దుగ్గిరాల

సహాయకార్యదర్శులు : శ్రీ కందుల ఓబుళరెడ్డిగారు, కంభంపోష్టు, కర్నూలుజిల్లా
,, పుణ్యమూర్తుల రాజశేఖరంగారు, బి. ఏ., బి. ఇడి.
డిప్. లిబ్., బ్రాడీపేట, గుంటూరు
,, మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ

సభ్యులు : శ్రీ చుండూరు కన్నయ్యశ్రేష్ఠిగారు, నవాబుపేట, నెల్లూరు
,, తాడిమేటి కుటుంబశాస్త్రిగారు,
నిడదవోలు, పశ్చిమగోదావరిజిల్లా
,, పూటుకూరు జయరాందాసుగారు,
వేటపాలెం, గుంటూరుజిల్లా
,, వేదాల తిరుమలవేంకటరామానుజస్వామిగారు,
ఆయుర్వేదాచార్య, శతావధాని,
ఆంధ్రఆయుర్వేదాశ్రమము, 430 సుల్తాన్ బజారు.
హైదరాబాదు
,, డబ్లియు. భీమసేనరావుగారు, ఆదవాని, బళ్లారిజిల్లా
,, పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులుగారు,
ఉపమాకఅగ్రహారము, నక్కపల్లిపోష్టు
విశాఖపట్టణముజిల్లా
,, సూరపనేని వెంకటరత్నంగారు, పెదసనగల్లు, కృష్ణాజిల్లా
,, ఈదుపుగంటి వేంకటరత్నమాంబగారు,
పెనమకూరు, కృష్ణాజిల్లా

శ్రీ నాగినేని వెంకయ్యగారు,
ధేనువుకొండ, అనమనమూరుపోస్టు, ఒంగోలుతాలూకా

డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు, యల్. యమ్. పి.
తాడేపల్లిగూడెము, పశ్చిమగోదావరిజిల్లా

శ్రీ యల్. సుందరరాజయ్యంగారు,
కంగుందికుప్పం, చిత్తూరుజిల్లా

,, కల్లూరి సుబ్బారావుగారు, యమ్. యల్. ఏ.
అనంతపురము

---

# ఆంధ్రదేశగ్రంథాలయసంఘము—బెజవాడ.

(1860 వ సం॥ 21 వ ఆక్టునను సరించి రిజిస్టరుచేయబడినది)

---

## సంకల్పపత్రము
(Memorandum of Association)

I. ఈసంఘము పేరు:

"ఆంధ్రదేశగ్రంథాలయసంఘము—బెజవాడ"

II. ఉద్దేశములు:

౧. ఆంధ్రదేశమున ధర్మగ్రంథాలయోద్యమము నభివృద్ధిచేయుట, ఈ క్రింద వివరింపబడిన సాధనములవలనను అందులకు విరుద్ధముకాని ఇతరసాధనముల మూలమునను ఈఉద్యమాభివృద్ధి కావింపబడును.

(క) బెజవాడ పట్టణమున ఆంధ్రదేశమున కంతకును కేంద్రగ్రంథాలయమును నిర్వహించుట.

(చ) ఆంధ్రదేశమున స్థాపింపబడునట్టియు, తదితర దేశములయందు ఆంధ్రులచే స్థాపింపబడునట్టియు,ధర్మగ్రంథాలయ సంఘములను, పఠనమందిరములను ఈసంఘమునకు చేర్చుకొనుట, అట్టివానిని స్థాపించుట.

(ట) "మాజిక్కులాంతరులు" "సినిమెటోగ్రాఫులు" "బయాస్కోపులు" మున్నగు యంత్రసామగ్రిని సేకరించి తన్మూలమున జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధిని కలుగజేయుట.

(త) సంచారగ్రంథాలయములను నెలకొల్పి వానిని ఆంధ్రదేశమునం దంతటను పంపి తన్మూలమున జ్ఞానాభివృద్ధిని జేయుట.

౨. ఆంధ్రదేశమునందును తదితర దేశములయందును శక్తికొలదిని ధర్మగ్రంథాలయోద్యమమునుగూర్చి జ్ఞానమును వ్యాపింపజేయుట

3. ఆంధ్రసారస్వతమునందలి గ్రంథములన్నిటికిని ప్రత్యేకప్రాముఖ్యతతో ఇతర గ్రంథరాజముల కన్నిటికిగూడ పనికివచ్చెడి గ్రంథవిభజన పట్టికను తయారుచేసి ప్రచురించుట.

౪. (క) జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధి నొందుటకుగాను జ్ఞానాభివృద్ధి కరములగు గ్రంథములు, కరపత్రములు మొదలగువానిని ప్రచురించుట.

(చ) జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధికి సాధనములుగానుండు జాతీయసంస్థాపనలను కాలానుసరణము లగునట్లు ఉద్ధరించుట

౫. ఆంధ్రజాతీయ వికాసమునకును, ఆంధ్రవ్యక్తి వికాసమునకును, సాధనభూతములగు సారస్వతము, విద్య, చిత్రకళలు, చరిత్రపరిశోధన మానవసేవ మున్నగు పరమార్థ కార్యములనుచేయుట.

౬. ఈసంఘముయొక్క ఉద్దేశములను గలిగిన ఇతర ప్రతిష్ఠాపనలతో కలిసి పనిచేయుట, అట్టివానితో సంబంధమును కలుగజేసికొనుట.

---

## నియమావళి

(Rules and Regulation)

I. సభ్యత్వము : సభ్యులు పదకొండురకములుగ నుందురు.

1. మహారాజపోషకులు

ఒకేసారి సంఘమునకు రు 1000-0-0 గాని, అంతకుమించిన రొక్కమునుగాని ఇచ్చువారు.

2. రాజపోషకులు

ఒకేసారి సంఘమునకు రు 250–0–0 గాని, అంతకుమించిన రొక్కమునుగాని, అంతకుసరిపడు స్థిరాస్తినిగాని ఇచ్చువారు.

3. పోషకులు

ఒకేసారి సంఘమునకు రు 100–0–0 గాని, అంతకుమించిన రొక్కమునుగాని, అంతకుసరిపడు స్థిరాస్తినిగాని ఇచ్చువారు.

4. సహాయులు

ఒకేసారి సంఘమునకు రు 50-0-0 గాని, అంతకుమించిన రొక్కమునుగాని ఇచ్చువారు.

5. శాశ్వతసభ్యులు

ఒకేసారి సంఘమునకు రు 25-0-0 గాని, అంతకుమించిన రొక్కమునుగాని ఇచ్చువారు.

6. సాధారణసభ్యులు

సంవత్సరమునకు రు 1-0-0 కు తక్కువగాని చందాచెల్లించువారు

7. గౌరవసభ్యులు

పాలకవర్గముచే సూచింపబడి సర్వసభ్యసభవారి ఆమోదమును బడసినవారు.

8. గ్రంథాలయములు—పఠనమందిరములు

ఈసంఘమునకుగాని, దీని శాఖాసంఘములకుగాని సంవత్సరమునకు రు 1-0-0 కు తక్కువగాని చందాచెల్లించునవి.

9. శాఖాసంఘములు

సంవత్సరమునకు రు 5-0-0 చందాచెల్లించునవి.

10. గ్రామపంచాయతీబోర్డులు, సహకారసంఘములు

సంవత్సరమునకు రు 2-0-0 చందాచెల్లించునవి.

11. మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, సెంట్రల్ బ్యాంకులు, తదితరసంస్థలు.

సంవత్సరమునకు రు 5-0-0 చందాచెల్లించునవి.

II. నిర్వాహణము :

1. సంఘవ్యవహారములు (1) ఒక అధ్యక్షుడు (2) ముగ్గురుఉపాధ్యక్షులు (3) ఒక కోశాధిపతి (4) ఒక కార్యదర్శి (5) ముగ్గురు సహాయకార్యదర్శులు (6) పంద్రెండుగురు సభ్యులుగల పాలకవర్గముచే నిర్వహించబడును.

2. (క) పాలకవర్గము సర్వసభ్యసభవారిచే సంవత్సరమునకొక పర్యాయము మేనెలలోజరుగు వార్షికసభలో ఎన్నుకొన బడ వలెను.

(చ) పాలకవర్గమునెన్నుకొనుటలో తెలుగుప్రాంతము లన్నిటికిని ప్రాతినిధ్యముండునటుల చూడవలెను.

(ట) పాలకవర్గములో సంవత్సర మధ్యకాలమున గలుగు ఖాళీలను పాలకవర్గమువారే భర్తీచేసికొనవచ్చును.

III. సభలు :

1. (అ) పాలకవర్గమువారు సంవత్సరమునకు కనీసము నాలుగు పర్యాయములైనను వేర్వేరు ప్రాంతములలో సమావేశమగుచుండవలెను.

(ఆ) పాలకవర్గసభకు కనీసము ముగ్గురుసభ్యులైనను హాజరు కావలెను. అత్యావశ్యకమైన కార్యమున్నప్పుడు సభ్యులకు తెలియజేసివారి లిఖితపూర్వక సమ్మతుల ననుసరించి తీర్మానముల చేయవచ్చును.

2. (అ) సర్వసభ్యసభ సాధారణముగా సంవత్సరమునకు ఒకతూరి సమావేశము కావలెను. అయితే సంఘాధ్యక్షులకు అవసరమని తోచినయెడల ప్రత్యేక సమావేశములను పిలువవచ్చును.

(ఆ) సర్వసభ్యసభకు కనీసము 15 గురు సభ్యులైనను హాజరు కావలెను.

3. (అ) పాలకవర్గములోని కనీసము ముగ్గురు కాని, సర్వసభ్యసభలోని కనీసము 15 మందిగాని సభ్యులు లిఖితపూర్వకముగ చర్చించవలసిన విషయములను తెలుపుచు కోరినయెడల ఆయా సంఘసమావేశములను, అట్టికోరిక అందజేయబడిన 15 దినములలోగా కార్యదర్శి జరుపవలెను. అటుల జరుపుటకు కార్యదర్శి తప్పినయెడల అధ్యక్షునికి తెలిపి మరి వారములోపల వారును సమావేశ మేర్పరచనియెడల ఆసభ్యులే సదరు సమావేశములను సమకూర్చవచ్చును.

(ఆ) పాలకవర్గ సభలకు 5 పూర్ణ దినము లును, సర్వసభ్యసభలకు 10 పూర్ణదినములును గడువుతో ప్రకటనలు సభ్యులకు పంపవలెను.

IV సర్వసభ్యసభ :

సంఘముయొక్క అన్నిరకముల సభ్యులు నిందు పాల్గొనుట కర్హత గలిగియుందురు. పాలకవర్గము నెన్నుకొనుట, బడ్జెట్లులను, వార్షిక నివేదికలను, ఉపనిబంధనలను అంగీకరించుట సంఘముయొక్క అన్నివ్యవహారముల పైనను అధికారము గలిగి యుండుట సర్వసభ్యసభయొక్క అధికారములు.

V పాలకవర్గము :

సంఘనిబంధనల ననుసరించి సంఘవ్యవహారముల నడపుట, సర్వసభ్యసభలో చేయవలసిన తీర్మానముల నాలోచించి నిర్ణయించుట, సర్వసభ్యసభవారి ఆమోదమునకు లోబడి గౌరవ సభ్యులను సూచించుట, ఉపనిబంధనలను చేయుట, కార్యాచరణ కవసరమైన ఉపసంఘముల నియమించుట పాలకవర్గము వారివిధులు.

VI అధ్యక్షుడు :

సంఘముయొక్క అన్నిసభలకును అధ్యక్షత వహించుట, సంఘ వ్యవహారములన్నిటిని నిర్వహించుట అధ్యక్షుని విధులు.

VII. ఉపాధ్యక్షులు :

అధ్యక్షుడిచ్చిన అధికారమునుబట్టి వారిస్థానే వ్యవహరించుట, అధ్యక్షుడు లేనిసమయములలో క్రమముననుసరించి హాజరైన ఉపాధ్యక్షులలో ఒకరు వారిస్థానము నాక్రమించి సభావ్యవహారములను జరుపుట ఉపాధ్యక్షుల విధులు.

VIII. కోశాధిపతి :

పాలకవర్గమువారి తీర్మానము ననుసరించి సంఘముయొక్క

ధనమును, ఆస్తినిజాగ్రత్తపరచి అందుకుసరియైన లెక్కలను వోచరులనుఉంచుట కోశాధిపతివిధులు.

IX. కార్యదర్శి :

1. సంఘసమావేశములను సమకూర్చుట, సంఘపక్షమున ఉత్తర ప్రత్యుత్తరముల జరపుట, అధ్యక్షుని అధికారమునకులోబడి సంఘతీర్మానములను అమలుజరపుట, సంఘమునకు సిబ్బందిని ఏర్పరచుట, శిక్షించుట, తొలగించుట, పాలకవర్గమువారి తీర్మానము ననుసరించి సంఘద్రవ్యమును వినియోగించుట, వార్షికనివేదికలను, బడ్జెటులను తయారుచేయుట కార్యదర్శి విధులు.

2. సంఘముపై తేబడు అన్నిఅభియోగములను సంఘమువారితరులపై తెచ్చెడి అన్నిఅభియోగములను కార్యదర్శి పేరట జరుపవలెను.

X. సహాయకార్యదర్శులు :

పాలకవర్గమువారు ప్రత్యేకముగా నిర్దేశించినపనులను కార్యదర్శి కోరినపనులను నెరవేర్చుచు కార్యదర్శి కన్నివిధముల సహాయపడుచుండవలెను.

XI. లెక్కలు—తనిఖీ :

తెలుగుసంవత్సరాదితో ఈసంఘముయొక్క లెక్కలు ప్రారంభమగును. ఈసంఘముయొక్క లెక్కలను ప్రతిసంవత్సరమును పాలకవర్గముచే నిర్ణయింపబడు తనిఖీదారునిచే తనిఖీచేయించవలెను.

XII. ప్రత్యేకనియమములు :

ఈసంఘముయొక్క నిబంధనలను వేటినైనను తొలగించుటకుగాని క్రొత్తవారిని చేర్చుటకుగాని, ఉన్నవానిని మార్చుటకుగాని సర్వసభ్యసభ కధికారము గలదు.

VIIIA



శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు

శాశ్వతగౌరవసభ్యులు

సంఘస్థాపననాటినుండియు 24 సంవత్సరములు వరుసగ

కార్యదర్శిగనుండి సేవజేసిరి

# విషయసూచిక

# ఆంధ్రదేశగ్రంథాలయసంఘము

స్థాపితము: 10-4-1914

## ఇరువదియైదవ సంవత్సర నివేదిక

(౨౪-౭-౩౮ వ తేదీనుండి ౩౦-౪-౩౯ వ తేదీవరకు)

గ్రంథాలయోద్యమవిషయమై అమెరికాదేశము ప్రపంచమునకు మార్గదర్శకమైనట్లే ఆంధ్రదేశమును బ్రిటిష్ఇండియాకంతటికిని ఆదర్శప్రాయముగనున్నది. ప్రభుత్వసహాయ మిసుమంతయైన లేకున్నను ఆంధ్రులు చాలకాలమునుండి ఈయుద్యమమును ప్రజలపై నాధారపడి నడపుట మరియు విశేషము. ప్రజాసేవయే పరమార్థముగ నెంచుకొని, దేశాభివృద్ధికి దివ్యసాధనములనదగిన గ్రంథాలయముల వ్యాపనకై ఇంతకాలము పనిచేయుచువచ్చిన నీసంఘనిర్వాహకులెంతయు శ్లాఘనీయులు. నడుమగలిగిన నంతరాయముల దాటుచు వారిప్పటివరకు నీసంఘముపేరు చెడకుండ బట్టుకొనివచ్చుటచేతనే నేడీ ఇరువదియైదవ సంవత్సరనివేదికను సమర్పించుకొనుభాగ్యము నాకు దక్కినది. ఈయవకాశమును నాకు కల్పించిన సంఘస్థాపకులు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి, తోడి గ్రంథాలయసేవకులకు నాప్రణామములు.

### సభ్యత్వము

లోగడ సంఘపత్రమున ప్రకటింపబడిన 'గ్రంథాలయ సర్వస్వము'యొక్క చందాదారులు సంఘసభ్యులుగ పరిగణింపబడుచుండిరి. ఈమధ్య నాపత్రిక ఆగిపోయినందునను, సంఘమునకు ప్రతిసంవత్సరము క్రమముగ చందాల చెల్లించువారు లేనందునను నివేదకకాలములో సంఘమున చేర్చబడిన సభ్యులందరును క్రొత్తవారే. సంఘసంవత్సరము తెలుగు సంవత్సరాదితో ప్రారంభమయ్యెను నూతనవత్సరమున నెల

దినములు నివేదిక సంవత్సరమునకు కలుపబడి ఈవాయిదాలోపల కనీసము 250 మంది సభ్యులనైనను చేర్పించ తీర్మానించుకొనియు, 1939 ఏప్రిల్ నెలాఖరునాటికి మొత్తము132మంది సభ్యులనుమాత్రము క్రిందివిధమున చేర్చగలిగితిమి. సభ్యుల చిరునామాల వివరములు అనుబంధము ౧. లో గలవు.

*1 మహారాజపోషకులు 1, సాధారణసభ్యులు 63

*2 గౌరవసభ్యులు 1, గ్రంథాలయములు & శాఖాసంఘములు 3, పఠనమందిరములు 63, సహకారపరపతిసంఘము 1.

సంఘ కార్యాలయమునకై భవనమునిమిత్తము త్వరలో విరాళములు సంపాదింపవలసియున్నందున మార్చి నెలలో చేయబడిన పైతీర్మానమును గట్టిగ అమలుపరచజాలకపోతిమి. ఈవిషయము లెట్లున్నను ఆంధ్రదేశమందలి గ్రంథాలయ, పఠనాలయములన్నియు నూతన సంవత్సరములోనైన తప్పక సంఘసభ్యులుగజేరి సంఘమునకు పుష్టిని గలిగించి ఆత్మాభివృద్ధికై కృషిచేయుటలో శ్రద్ధవహింపగలవని నమ్ముచున్నాను. భారతదేశమున గ్రంథాలయోద్యమ ప్రచారమునిమిత్తము ప్రప్రథమమున స్థాపింపబడిన మన సంఘగౌరవమును నిలుపవలెనన్న, మనదేశమందలి వివిధరాష్ట్రములందేగాక ఖండాంతరములందును దీని కీర్తి వ్యాపింపవలెనన్న, నేటి మనగ్రంథాలయముల దిక్కుమాలినస్థితి తొలగి, అవిచ్ఛిన్నక్రమముగ నడచి అన్ని విధముల దేశాభివృద్ధికి తోడ్పడవలెనన్న విజ్ఞులగు ఆంధ్రమహాజనులెల్లరు నిందు సభ్యులుగ జేరుట ముఖ్యము.

---

*1 బెజవాడ తాలూకా పటమటలంక వాస్తవ్యులు శ్రీ కొమ్మా సీతారామయ్యగారు సంఘకార్యాలయమునకై స్థలమును కొను నిమిత్తము రు 1000/- ల నిచ్చి సంఘమునకు మహారాజపోషకులైరి. వీరికి సంఘమువా రెంతయు కృతజ్ఞులు.

*2 25-12-38 వ తేదీ పటమట (బెజవాడతాలూకా)లో కూడిన సర్వసభ్యసభవారు పాలకవర్గమువారి సలహాపై "ఆంధ్రదేశగ్రంథాలయ సంఘస్థాపకులలో నొకరై ఆదినుండి నేటివరకు అప్రతిమానసేవ ఆంధ్రదేశగ్రంథాలయోద్యమమునకే గాక, అఖిలభారతగ్రంథాలయోద్యమ సేవతోకూడ నిర్వహించిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారిని ఈ సంఘమునకు యావజ్జీవగౌరవసభ్యులుగ" నెన్నుకొనిరి.

# సంఘ సమావేశములు

సర్వసభ్యసభ :

నివేదికకాలములో ఈ సంఘముయొక్క సర్వసభ్యసభ 24–7–38 వ తేదీ బెజవాడలోను 25–12–38 వ తేదీ పటమటలోను రెండుమారులు కూడినది. ఇందు మొదటి సమావేశమునందు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగా రధ్యక్షులుగను శ్రీపాతూరి నాగభూషణం కార్యదర్శిగను నూతన పాలకవర్గ మేర్పాటుచేయబడినది.

రెండవ సమావేశమున సంఘనిర్మాణమున మార్పులు సూచించుటకై యేర్పాటు చేయబడిన ఉపసంఘమువారి నివేదికపాలకవర్గమువారి సవరణలతో అంగీకరింపబడి నూతన నియమావళి ప్రకారము తిరిగి 1940 వ సం॥లో సంఘముయొక్క నూతన ఎన్నికలు జరుగువరకు అమలులోనుండు నట్లు 17 మందిగల పాలకవర్గము క్రొత్తగ నెన్నుకొనబడినది. మిగిలిన సహాయకార్యదర్శిని, ముగ్గురు సభ్యులను ఎన్నుకొనుటకై క్రొత్తపాలకవర్గమున కధికార మీయబడినది.

పాలకవర్గము :

ఈసంఘముయొక్క పాలకవర్గము నివేదికకాలములో 4-9-38వ తేదీ గుంటూరులోను, 9-10-38 వ తేదీ మద్రాసునందును, 25-12-38వ తేదీ పటమటలోను, 13-4-39 వ తేదీ పటమటలంకలోను నాలుగు పర్యాయములు కూడినది. 11-3-39 వ తేదీ తెనాలిలో జరుగవలసిన సమావేశమునకు నిర్ణీతసంఖ్య హాజరు కానందున సభ జరుగలేదు. అవసర విషయములు 17-3-39 వ తేదీ సభ్యులకు పంపబడి వారి సమాధానములనుబట్టి తీర్మానములు రికార్డుచేయబడినవి.

## సంఘనిర్మాణమున మార్పు

మనసంఘము నిర్మాణమై చాలకాలమైనది. దేశ, కాల, పాత్రముల ననుసరించి సర్వధర్మములు మార్పుజెందవలసియుండును. అందువలన నేటిపరిస్థితుల కనుకూలముగనుండునట్లు సంఘనియమావళిలో

నివేదికకాలములో కొన్ని మార్పులు చేయబడినవి. ఇందునిమిత్తమేర్పాటుచేయబడిన ఉపసంఘుసభ్యులు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి, పుణ్యమూర్తుల రాజశేఖరం, పాతూరి నాగభూషణంగార్లు తయారు చేసిన నివేదిక పాలకవర్గమువారి సవరణలతో 25-12-38 వ తేదీ పటమటలోకూడిన సర్వసభ్య సభవారి అంగీకారమును పొంది తీర్మానింపబడినట్లు పైన చెప్పియుంటిని. ప్రస్తుతమమలునందున్న సంఘు నియమావళి నివేదిక ప్రారంభమున చూడవచ్చును.

చాలకాలము క్రితము వ్రాయబడినందున నేడు గ్రంథాలయోద్యమాభివృద్ధికి మిగుల నవసరములని తలంపబడుచున్న ముఖ్యాంశములు కొన్ని సంఘోద్దేశములలో చేర్చబడలేదు. దీనిని గమనించి సంఘపాలకవర్గమువారు 13–4–39 వ తేదీ పటమటలంకలో కూడినప్పుడు సంఘోద్దేశములలో చేయవలసిన మార్పులను సూచించవలసినదిగ కార్యదర్శిని కోరియుండిరి. దీని ననుసరించి తయారుచేయబడిన నివేదిక పాలకవర్గసభ్యుల కందజేయబడినది. దీని నకలు అనుబంధము ౨. లో నీయబడినది. సర్వసభ్యసభవారి చట్ట సమ్మతమగు ఆమోదముతో నీ మార్పులమలులోనికి వచ్చును.

## శాఖాసంఘుములు

ఈ సంఘము స్థాపింపబడినదాదిగ వివిధప్రాంతములలో దీని కార్యక్రమమును నిర్వర్తించుటకై పట్టణ, తాలూకా, జిల్లా గ్రంథాలయ సంఘము లేర్పరుపబడుచు వచ్చినవి. ఇందు చాలభాగము క్రమముగ సాగకుండుటయు, పనిచేయుచున్నవైనను కేంద్రసంఘముతో నిర్దుష్టమైన సంబంధమును గలిగియుండక పోవుటయు గ్రహించి దీనివిషయమై నివేదిక కాలమందు కొంతశ్రద్ధ గైకొనబడెను. దీని శాఖాసంఘము లన్నియు సంవత్సరమునకు రు 5/- లు రుసుము కేంద్రసంఘమునకు చెల్లించునట్లును, అట్లు చేయునవి తమ యేరియాలోని గ్రంథాలయములనుండి వసూలగు సభ్యత్వ చందాలను తామే తీసికొనునట్లును, తమ చందాలను చెల్లించు ప్రతిగ్రంథాలయము, పఠనాలయము కేంద్ర సంఘమునందును తమ యేరియాకు సంబంధించిన శాఖాసంఘమునం

దును సభ్యత్వము కలిగియుండునట్లును సంఘనియమావళి సవరింపబడి ఈ విషయము అన్నిప్రాంతములలోను బయలుదేరిన శాఖాసంఘము లకు తెలుపబడెను. దీనిపై తాడేపల్లిగూడెం (పశ్చిమగోదావరిజిల్లా), దివి (కృష్ణాజిల్లా), తెనాలి (గుంటూరుజిల్లా) తాలూకా సంఘములు మాత్రము తమ శాఖాసంఘ రుసుముల చెల్లించెను. భీమవరం (ప. గో. జిల్లా), నరసరావుపేట (గుంటూరుజిల్లా) తాలూకా సంఘ ములు కొలదికాలములో తమ రుసుముల పంపునట్లు నివేదిక సంవత్స రాంతమున తెలిపియుండెను.

మఱియు నీనివేదికయందు చేర్చునిమిత్తము అన్నిశాఖాసంఘ ములు తమ సంవత్సరనివేదికల పంపునట్లు కోరబడి తాడేపల్లిగూడెం, తెనాలి, నరసరావుపేట, గుంటూరు తాలూకా సంఘములును, గుంటూరు పట్టణసంఘమును మాత్రము మాకు నివేదికల బంపినవి. ఒక్కొక్కటిగ నీసంఘముల కార్యనివేదికలలోని ముఖ్యాంశములు క్రింద బొందుపరుపబడినవి.

తాడేపల్లిగూడెం తాలూకాగ్రంథాలయ సంఘము :

17-11-33 వ తేదీ స్థాపింపబడి డాక్టరు తేతలి సత్యనారాయణ మూర్తిగారి దీక్షవలన నిరంతరాయముగ సాగుచు తాడేపల్లిగూడెం తాలూకాలోని గ్రంథాలయోద్యమవ్యాప్తికి చక్కగ తోడ్పడుచున్నది. ఈసంఘము స్థాపింపబడినప్పుడు తాలూకాయందున్న గ్రంథాలయ ముల సంఖ్య 33, నేడు 77 వరకు పెరిగినది. ఇందు జిల్లాబోర్డు గ్రంథా లయములు 5; పంచాయతీబోర్డువి 49; కమిటీవి 23. ఈసంఘ కార్య క్రమమున గ్రంథాలయ యాత్రలు ముఖ్యస్థానము నాక్రమించుచున్నవి. నివేదికకాలమున 3 ఫిర్కాలలో 21 దినములు 44 గ్రామములకు యాత్రీకులువెళ్లి 12 గ్రంథాలయములను స్థాపించి 32 గ్రంథాలయముల వార్షికోత్సవముల జరిపించిరి. గ్రంథాలయోద్యమ నాయకులు, ప్రముఖులగు గ్రంథాలయ సేవకులతోపాటు వివిధశాఖలకు చెందిన తాలూకా ప్రభుత్వోద్యోగులును యాత్రాదళమున చేరి విద్య, విజ్ఞా నములకు సంబంధించిన అనేక విషయములపై ఉపన్యాసములును,

మ్యాజికులాంతరు ప్రదర్శనములును గ్రామములలో గావించిరి. తాలూకా యందలి గ్రంథాలయములను తరచు సందర్శించి అవసరమైన సలహాల నిచ్చునిమిత్త మొక సూపరువైజరును గౌరవ వేతనముపై నీ సంఘమువా రేర్పాటుచేసిరి.

సంఘసభ్యులు : వ్యక్తులు 11 ; గ్రంథాలయములు 26
ఆదాయము రు 41-0-0 ; వ్యయము రు 50-2-3
అధ్యక్షులు : డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు
యల్. యం. పి.
కార్యదర్శి : శ్రీ ధూళిపాళ సత్యనారాయణగారు
కార్యాలయము : తాడేపల్లిగూడెం—పశ్చిమగోదావరిజిల్లా.

తెనాలితాలూకా గ్రంథాలయ సంఘము :

స్థాపింపబడి చాలకాలమైనది. కొంతకాలము అద్భుతముగ పని చేసినది. నడుమ పని మందగించి తిరిగి 10-7-37 వ తేదీ పునరుద్ధరింపబడినది. నివేదికకాలమున 12-5-38 వ తేదీ వామనగుంటపాలెము నందు జరిగిన 7 వ తాలూకాగ్రంథాలయ మహాసభ కాక మరి 7 తావుల వివిధవిషయములపై ప్రసంగములు, 1 మ్యాజికులాంతరు ప్రదర్శనము సంఘపక్షమున నడచినవి. "సకలజనులకు జీవితసౌఖ్యమున కుపకరించు గొప్పసాధనము గ్రంథాలయము" అను శీర్షికతో నొక కరపత్రము ప్రకటింపబడి తాలూకాయందంతట నుచితముగ పంచిపెట్టబడినది. "గ్రామగ్రంథాలయములం దుండవలసిన పట్టికల"ను గూర్చి 11-9-38 వ తేదీ తెనాలిలో సంఘపక్షమున నొక చర్చ యేర్పాటు చేయబడినది. పైన నుదహరింపబడిన తాలూకాగ్రంథాలయ మహాసభలో ఇతరవిషయములతోపాటు "గ్రంథాలయనిబంధనలు-నిర్మాణ చట్టము" అనువిషయముపై నొకవ్యాసము చదువబడి అది 'ప్రజాబంధు' 3-6-38 వ తేదీ పత్రికయందు ప్రకటింపబడినది. 'మహతి' మాసపత్రికయు గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన క్రింది గ్రంథములును సంఘమునకు నివేదికకాలములో కొనబడినవి.

1. Five Laws of Library Science
2. Popular Libraries of the World
3. All Asia Educational Conference:
   Papers offered to the Library Section

5-2-39 వ తేదీ తెనాలి-నిజాంపట్నము ప్రయాణీకుల పడవలో పఠనాలయమొకటి సంఘపక్షమున ప్రారంభింపబడినది.

సంఘసభ్యులు:—వ్యక్తులు

| | |
|---|---|
| శాశ్వత సభ్యులు | 5 |
| సాధారణ సభ్యులు | 90 |
| గ్రంథాలయములు | 16 |

ఆదాయము రు 84-9-9 ; వ్యయము రు 69-4-3
అధ్యక్షులు : శ్రీవడ్లమూడి వేంకటరత్నముగారు, ఉ. భా. ప్ర.
కార్యదర్శి : ,, గుండవరపు వేంకటేశ్వర్లుగారు
1938-39 వ సం॥ కార్యనివేదిక (క్రౌను 20 పే.) అచ్చువేయబడినది.

కార్యాలయము : చుండూరు (వయా) తెనాలి.

నరసరావుపేట తాలూకా గ్రంథాలయ సంఘము :

స్థాపితము 30-4-37. మొదటిసంవత్సరము పని సరిగజరుగలేదు. 26-6-38 వ తేదీ గన్నవరంలో ద్వితీయతాలూకా గ్రంథాలయ మహాసభ జరిగి అందు సంఘమునకు కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడినది. తాలూకాలోనున్న గ్రంథాలయముల చరిత్రలు సేకరింపబడి ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమునకు, గుంటూరుమండలగ్రంథాలయ సంఘమునకు పంపబడినవి. 24-9-38 వ తేదీ మొదలు 2-10-38 వ తేదీవరకు తాలూకాయాత్ర జరుపబడి 16 గ్రామములలో గ్రంథాలయప్రచారము, విజ్ఞానవ్యాప్తి చేయబడెను. గ్రంథాలయముల నిర్వహణ కవసరమైన సలహాలీయబడెను.

సంఘసభ్యులు : వ్యక్తులు 2 ; గ్రంథాలయములు 2
ఆదాయము రు 4/- ; వ్యయము రు 4/-

అధ్యక్షులు : శ్రీ గుంటుపల్లి వేంకటేశ్వరరావుగారు
కార్యదర్శి : కనుపర్తి రామకృష్ణశర్మగారు
కార్యాలయము : కనుపర్రు - సాతులూరుపోస్టు

గుంటూరుతాలూకా గ్రంథాలయసంఘము :

27-10-37 వ తేదీ గుంటూరు శ్రీ శారదానికేతనమునం దేర్పాటుచేయబడిన సభయందు ప్రస్తుతసంఘ మేర్పరుపబడినది. నివేదిక కాలమున 4 గ్రామములలో నీసంఘపక్షమున సభలేర్పాటుచేయబడినవి. గుంటూరు హుసేనుపేటలో 6 నెలలపాటు 6 గురు వయోజనులగు మహమ్మదీయులకు చదువు చెప్పబడినది.

అధ్యక్షులు : శ్రీ రాయసం వేంకటశివుడుగారు, యమ్. ఏ.
కార్యదర్శి : పి. నాగభూషణంగారు

గుంటూరుపట్టణగ్రంథాలయ సంఘము:—

వంగదేశ గ్రంథాలయసంఘకార్యదర్శి శ్రీ టి. సి. దత్తాగారి రాకను పురస్కరించుకొని 22-11-36 వ తేదీన ఈసంఘము స్థాపింపబడినది. వైద్యశాలలందలి రోగులకు గ్రంథాలయసేవచేయు సంకల్పముతో ఆం. దే. గ్రం. సంఘాధ్యక్షులద్వారా సర్జనుజనరలుగారి అంగీకారమునుబడసి (11-9-37 జాబు) గుంటూరుజిల్లా వైద్యాధికారి 6-11-37 వ తేదీ అనుమతిపత్రము ననుసరించి కొంతకాలము పుస్తకములు వగైరా జనరల్‌హాస్పిటల్‌లోని రోగులకందజేయబడెను. దీనివలన మంచిఫలితము కలుగగ ఆరోగ్యము, సారస్వతము, గ్రంథాలయోద్యమమాదిగాగల విషయములపై రోగులకప్పుడప్పు డుపన్యాసములేర్పాటుచేయబడెను. నివేదికకాలమున నిట్టి ప్రసంగములు 9 జరిగెను. గుంటూరు కుష్ఠురుహాస్పిటల్ అధికారిణి తమ వైద్యాలయమునందలి రోగులకు గ్రంథప్రచారము చేయుటకై అనుమతించెను.

అధ్యక్షులు : శ్రీ వి. వి. పున్నయ్యగారు, యమ్. యల్. సి.
కార్యదర్శి : శ్రీ వి. పుల్లారావుగారు, బి. ఏ.

# శిక్షణ

నిర్వహణ క్రమముగ లేనిచో గ్రంథాలయము లభివృద్ధిజెందుట దుస్తరము. నేటి మన గ్రంథాలయములలో చాలభాగము మూలబడుటకిదియొక కారణము. గ్రంథాలయముల సక్రమనిర్వహణకు విద్య, విజ్ఞానములతోపాటు సుశిక్షణయు నావశ్యకము. ప్రభుత్వము దేశీయమై, విద్యమాతృభాషద్వారా గరపబడుచో నీపనిని విశ్వవిద్యాలయములే పూనిచేయవచ్చును. ఇప్పుడు మన కీరెండును పూజ్యములగుటచే నీభారమును ప్రజాసంస్థలే వహించవలెను. అందును గ్రంథాలయోద్యమాభివృద్ధికై ప్రత్యేకము కంకణముకట్టుకొన్న మన సంఘము దీనిని చేపట్టవలసిన అవసరమును నొక్కిచెప్ప బనిలేదు. మనముగాకున్న మరొక్కరు దీనికి పూనుకొనరు. ఇట్టి ప్రయత్నము 1934 వ సం॥లో నొకపర్యాయము మన సంఘముచే గావింపబడి ఒకనెల దినములపాటు 32 మందికి గ్రంథాలయనిర్వహణవిధానమున సశాస్త్రీయమగు శిక్షణ ఇయ్యబడెను. అవకాశములేనందున నివేదికకాలములో గ్రంథాలయ శిక్షణ తరగతులకు ప్రత్యేకపుటేర్పాట్లు చేయజాలకపోతిమి. అయినను కృష్ణాజిల్లా రైతాంగవిద్యాలయము వారికోరికపై 1938 వ సం॥ నవంబరు 3 వ వారములో గ్రంథాలయనిర్వహణకు సంబంధించిన క్రింది విషయములపై సంఘకార్యదర్శి 5 ఉపన్యాసముల నిచ్చెను.

1. గ్రంథాలయనిర్వచనము : ఉపయోగములు : ప్రాశస్త్యము
2. గ్రంథాలయనిబంధనలు — నిర్మాణచట్టము
3. గ్రంథాలయముఖ్యాంగములగు పుస్తకములు, భవనములు, సిబ్బంది
4. గ్రంథాలయములందుంచవలసిన రికార్డులు
5. గ్రంథాలయసంఘములు — పనికార్యక్రమము

రాబోవు సంవత్సరములో గ్రంథభాండాగారులకు శిక్షణతరగతుల నేర్పాటుజేయు సంకల్పము మాకుగలదు.

# ప్రచారము

ఉపన్యాసములు వగైరా :

గ్రంథాలయ నిర్వహణకు శిక్షణమువలెనే, ఉద్యమప్రాబల్యమునకు ప్రచారమును మిగులనవసరము. ప్రచారము పలువిధములుగ చేయవచ్చును. సభలు, పత్రికలు దీనికి గొప్పసాధనములు. నిత్యము పత్రికలలో మనముచూచు గ్రంథాలయ సంబంధమైన వార్తలు, వ్రాతలు - ఊరూర జరుగు గ్రంథాలయోపన్యాసములు, ప్రదర్శనములు - మన యుద్యమమున కెంతగనో ఉపకరించుచున్నవి. వీనియన్నిటిలెక్క నేనియ్యజాలను. కొలదిపాటి అవకాశములో నిది సాధ్యమునుగాదు. వేరువేరు ప్రాంతముల మన శాఖాసంఘములు నడపుచున్న కార్యక్రమముయొక్క సంగ్రహనివేదికలు పైనగలవు. సంఘసభ్యులుగాని, పాలకవర్గమువారుగాని వ్యక్తిగతముగ నెరపిన కార్యక్రమ వివరములు తెలుపుట కెడము లేదు. వీని సమాచారములు లభించుటయు కష్టమే. కాని వివరములున్నంతవరకు నివేదికకాలములో కార్యదర్శి వివిధప్రాంతములలో సంఘపక్షమున పర్యటనముచేసి గావించిన ప్రసంగములు, దర్శించిన భాండాగారములు, పత్రికలలో ప్రకటించిన వ్యాసములు 3, ౪, ౫ అనుబంధములలో గాననగును.

రేడియో :

ఈసందర్భమున ప్రభుత్వమువారు మద్రాసు రేడియోస్టేషను నుండి బ్రాడ్‌కాస్టుచేసిన గ్రంథాలయోపన్యాసములకుగాను వారికి సంఘపక్షమున కృతజ్ఞతదెలుపుట మనధర్మము. జనసామాన్యమున కందుబాటులోనుండని ఆంగ్లోపన్యాసములుగాక 2-8-38 వ తేదీనుండి 15-3-39 వ తేదీలోపల గ్రంథాలయప్రచారమున కనుకూలించు 6 తెలుగు ఉపన్యాసములు మద్రాసు కేంద్రమున ఇప్పింపబడెను.

| తేదీ. | విషయము. | కాలము. | ఉపన్యాసకులు. |
|---|---|---|---|
| 2-8-38. | సంచారగ్రంథాలయములు | 15 ని. | అయ్యంకి వేంకటరమణయ్యగారు |
| 4-10-38. | తంజావూరులోని తిరుమల నాయకుని గ్రంథాలయం | ,, | శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు |

| తేదీ. | విషయము. | కాలము. | ఉపన్యాసకులు. |
|---|---|---|---|
| 5-11-38. | బరోడా గ్రంథాలయము | 15 ని. | మల్లంపల్లి సోమశేఖరశర్మగారు |
| 3-12-38. | కలకత్తా ఇంపీరియల్ లైబ్రరీ | ,, | శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు |
| 22-12-38. | మద్రాసు గ్రంథాలయములు | ,, | ఆర్. జనార్దనంనాయుడుగారు |
| 15- 3-39. | గ్రామగ్రంథాలయములు | 10 ని. | పాతూరి నాగభూషణంగారు |

మహాసభలు :

నివేదికకాలములో తెనాలి, తాడేపల్లిగూడెం, బెజవాడ తాలూకాలలో 3 తాలూకా మహాసభలు మాత్రము జరిగినవి. ఈమధ్య జిల్లాసభలు బొత్తుగ మందగించినవి. ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభజరిగికూడ 18 నెలలుదాటినది. ఒక్కసారి విజృంభించి దేశము నలుమూలల లెక్కకుగాక క్రమమైనపద్ధతిని తాలూకా, జిల్లా గ్రంథాలయ ప్రతినిధుల మహాసభలను జరిపి ఉద్యమమునకు నూతనోత్తేజమును గలిగించుట చాల అవసరముగ గన్పట్టుచున్నది. సభలను జరుపుటతో తృప్తిపడక అన్నిప్రాంతములందును జిల్లా, తాలూకా, నగరగ్రంథాలయ సంఘముల నేర్పరచి అవి యన్నియు తమ తమయేరియాలలో ఉద్యమవ్యాప్తికి కృషిచేయునట్లు ప్రోత్సహించుటయు ముఖ్యము. మరియు మహాసభలు జరుపునప్పుడు ఉపన్యాసములు, తీర్మానములు గ్రంథాలయములకుగల ప్రస్తుత చిక్కుల నెదుర్కొని వానిని చక్కజేసికొనుటకును, జనసామాన్యమున ప్రబోధమును గావించి వారిసాయముతో ప్రభుత్వపుదృష్టిని గ్రంథాలయోద్యమము వైపుకు నాకర్షించి, వీనిద్వారా గ్రంథాలయములపోషణ కవసరమైన సమస్త సహాయసంపత్తుల సంపాదించుటకును దోహదముగనుండునట్లు చూచుట ప్రధానము. మహాసభలు గ్రంథాలయాభిమానులనందర నాకర్షించి అందరనొక్కమార్గమున నడపించ గలిగిననే తప్పనవి నిష్ప్రయోజనములగును. ఇందులకు గ్రంథాలయ సేవకులమందరము ఐకమత్యము, పట్టుదల గలిగి పనిచేయవలసియున్నది.

గ్రంథాలయపత్రిక :

గ్రంథాలయోద్యమ ప్రచారమునకు దేశమునగల పత్రికలన్నియు ఓపిన సహాయము గావించుచున్నను, ఇది పూర్ణరూపము

దాల్చుటకు సంఘమునకు ప్రత్యేక మొకపత్రిక యుండుటెంతయు నవసరము. దీనిని గమనించియే సంఘస్థాపన కాలమునుండియు మధ్యమధ్య విఘ్నములు గల్గుచున్నను శ్రీఅయ్యంకి వేంకటరమణయ్యగారు పట్టుదలతో చాలకాలము * "గ్రంథాలయసర్వస్వము"ను నడపుచువచ్చిరి. సంఘ జీవితకాలములో ఈపత్రికయొక్క సంపుటముల పదకొండింటిని గ్రంథాలయలోకము చూచుకొనగ నోచినది. అయినను తగిన సహాయసంపత్తి లేనికారణమున రెండేండ్లక్రితమే దానిముద్రణ ఆపివేయబడినది. మరల పునరుద్ధరింపవలెనను సంకల్పముగలిగి 24-7-38 వ తేదీ బెజవాడలో కూడిన సర్వసభ్యసమావేశమునందు సంఘపక్షముననే లాభనష్టములతో సంఘమునకు నిమిత్తములేకుండ దీనిని నిర్వహించుటకై క్రింది సభ్యులతో నొక యుపసంఘము నియమితమైనది. (శ్రీ) అడుసుమిల్లి శ్రీనివాసరావు, పాతూరి నాగభూషణం, పుణ్యమూర్తుల రాజశేఖరం గార్లు.

ఈయుపసంఘము వారొకటిరెండు పర్యాయములు గుంటూరులో సమావేశమై దీర్ఘచర్చలుచేసి, దీనిని ఆంధ్రాంగ్లభాషలలో 3 నెలలకొకతూరి ప్రకటించుటకును, దీనిపేరును "ఆంధ్రగ్రంథాలయం" అని మార్చుటకును, శ్రీపుణ్యమూర్తుల రాజశేఖరంగారిని సంపాదకులుగను, (శ్రీ) అడుసుమిల్లి శ్రీనివాసరావుగారిని ప్రకాశకులుగను, నుంచుటకును నిశ్చయించిరి. ప్రకటన కనుమతి (డిక్లరేషన్) తీసికొని చాలకాలమైనది. త్వరలో దీనిరూపమును మనము చూడగలుగుదుమని ఆశించుచున్నాను. దీని ప్రకటనతో సంఘకార్యక్రమమునకు చక్కని చేయూత, గ్రంథాలయనిర్వహణకు సంప్రదాయసిద్ధమగుసలహా, ఉద్యమవ్యాప్తికి గొప్పతోడ్పాటు చిక్కునని నాతలంపు.

## ప్రభుత్వము—సంఘురాయబారము

గ్రంథాలయోద్యమ వ్యాప్తికి సహాయభూతముగ నుండుటకై అవసరములగు విషయముల నివేదించునిమిత్తము మద్రాసు ప్రభుత్వ

* ఇది మొదట 3 నెలలకొకతూరియు, తదుపరి కొన్నాళ్ళు 2 నెలలకొకతూరియు, చివరకు మాసపత్రికగను ప్రకటింపబడెను.

మంత్రులలో ప్రధానామాత్యులు, విద్య, స్థానికసంస్థలు, పరిశ్రమ శాఖల మంత్రులవద్దకు సంఘపక్షమున రాయబారము వెడలుటకై పాలకవర్గము వారు తీర్మానించుకొని సంఘాధ్యక్షులగు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి నాయకత్వమున ప్రధానమంత్రిని తప్పతక్కిన వారిని 28-11-38 వ తేదీ కలసికొన గలిగితిమి. ప్రధానమంత్రి మా జాబుకు సమాధానమియ్యక వారి కార్యక్రమము నిర్ణయించకపోవుటచే వారిని కలసికొన జాలమైతిమి. రాయబారవర్గమున సంఘకార్యదర్శి, అధ్యక్షులతోపాటు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి, చరువు శ్రీశైలమల్లికార్జునుడు, శరణు రామస్వామి చౌదరి, దేశపాండ్య సుబ్బారావుగార్లు సంఘప్రతినిధులుగ వెడలిరి. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ సంగ్రహచరిత్ర, మన సంఘపక్షమున నింతవరకు జరుపబడిన కార్యక్రమముయొక్క ముఖ్యవివరములు, ప్రస్తుతము ఉద్యమాభివృద్ధికవసరమైన సంగతుల వివరించు నివేదిక ఆంగ్లమున టైపుచేసి వారికి సమర్పించబడెను.

సంఘముయొక్క కేంద్రకార్యాలయమునకు ఉద్యమప్రచారము నిమిత్తమేటేట విరాళమునిచ్చుటకును, సహకారసంఘములు, స్థానికసంస్థలు వగైరా సంఘమునసభ్యులుగ జేరుట కనుమతించుటకును, మన రాజధానిలోని గ్రంథాలయముల కిదివరకిచ్చుచున్న గ్రాంటులపున రుద్ధరించి ఆమొత్తము సంవత్సరమునకు లక్షరూపాయలైన నుండునట్లు చేయుటకును, వ్యవసాయము, పశువైద్యము, ఆరోగ్యము, పరిశ్రమ శాఖలకు సంబంధించిన కరపత్రముల రాష్ట్రమందలి అన్నిగ్రంథాలయములకును, ఫోర్టుసెంటుజార్జిగజెట్టును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకును, జిల్లాగజెట్టులను జిల్లాగ్రంథాలయ సంఘములకును ఉచితముగా నిచ్చుటకును, ప్రస్తుతమున్న గ్రంథాలయముల రిజిస్ట్రేషనురుసుము రు 50/- మొత్తమును రద్దుచేయుటకును, నిషేధగ్రంథముల జాబితాను సంవత్సరమున కొకతూరి గ్రంథాలయములకుపంపుచు నిషేధింపబడని గ్రంథములను కొనుటకై గ్రంథాలయములకు స్వతంత్రముండునట్లు చేయుటకును, ప్రస్తుతమున్న టెక్స్టుబుక్ కమిటీ నిర్మాణమును పూర్తి

గామార్చి అందు గ్రంథాలయ సంఘములతోపాటు గ్రంథములకు సంబంధించిన అన్నివర్గములకు ప్రాతినిధ్యముండునట్లు చేయుటకును, నూతనపద్ధతిని రాత్రిపాఠశాలలను, వసంతవిద్యాలయములను ప్రోత్సహించుటకును, ముందు మద్యనిషేధమమలునందున్న ప్రాంతముల వేసవిసెలవులలో కాలేజీ, హైస్కూళ్ళవిద్యార్థుల నిరక్షరాస్యనిర్మూలన ప్రచారమునకై వినియోగించునేర్పాట్లు చేయుటకును, దీనికంతటికినీ దేవాదాయ, ధర్మాదాయముల రాబడినుండి నాల్గవవంతు ధనమును గ్రంథాలయములు, వయోజన విద్యాప్రచారముల నిమిత్తము ప్రత్యేకించుటకును నివేదికయందు కోరబడెను.

ఈవిషయములే క్లుప్తముగ చెప్పినమీదట గ్రాంటులవిషయమై నూతనసంవత్సరపు బడ్జెటులో 25 వేలను గ్రంథాలయములకు ప్రత్యేకించవలసినదిగ ప్రధానమంత్రిగారిని కోరితిమనియు, అది అంగీకరింపబడుచో నామొత్తములో కొంత మన సంఘమున కిత్తుమనియు, రిజిస్ట్రేషనురుసుము విషయములో ఇండియాప్రభుత్వమునకు వ్రాయుదుమనియు, గ్రంథాలయములకు పుస్తములు కొనువిషయములో నిర్వాహకులకు స్వతంత్రముండునట్లు చూతుమనియు, టెక్స్టుబుక్ కమిటీ నిర్మాణమున మార్పులుచేయు సంకల్పము తమకు కలదనియు, ఆసందర్భమున మనసూచనలు విచారించబడుననియు, గజెట్టులను ఉచితముగ నిచ్చువిషయమై కొంత తగ్గింపుకుమాత్ర మవకాశముండుననియు అప్పటి విద్యామంత్రి డాక్టరు సుబ్బరాయన్ గారు సమాధానము చెప్పిరి. కాని తదుపరి వారు న్యాయశాఖామంత్రి యగుటయు, మనకోరికలు బొత్తుగ విచారణకు రాకపోవుటయు తటస్థించెను. నివేదికకాలమున ఈ విషయమై తిరిగి యేవిధమైనచర్య తీసికొనుటకును అవకాశము లేకపోయెను. ఈ నివేదికను తర్వాత శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారుచితముగ నచ్చొత్తించి సంఘమునకొసంగిరి. వారికి సంఘమువారెంతయు కృతజ్ఞులు.

## సంఘప్రచురములు

ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక:

నివేదికకాలమున సంఘపక్షమున “ ఆంధ్రదేశగ్రంథాలయముల

పట్టిక" ప్రకటింపబడినది. ఆంధ్రదేశమున ప్రస్తుతమమలునందున్న గ్రంథాలయములలో 779 గ్రంథాలయముల చిరునామాలుమాత్ర మిందు చేర్చబడినవి. ఆంధ్రావనిగల మిగిలిన గ్రంథాలయముల చిరు నామాలనుకూడ త్వరలో సంపాదించి దీనికనుబంధమును ప్రకటించవలసి యున్నది. మాయీప్రయత్నమునకు సంఘసభ్యులతో బాటు ఉద్యమాభి మానులెల్లగు తోడ్పడగోరెదను. సంఘమునకు నిల్వధనమేమియు లేని కారణమున దీని అచ్చుకై ప్రకటనలపైనను, శ్రీ నాగినేని వెంకయ్య (రు 10) మల్లెల శ్రీరామమూర్తి (రు 5) గార్ల విరాళములపైనను ఆధారపడవలసివచ్చెను. దీనికిగాను ప్రకటన కర్తలకును, పైదాతలకును చాల కృతజ్ఞులము. ఈపట్టిక వెల రు 1-0-0. సంఘసభ్యులకు మాత్ర ముచితముగ నిత్తుము.

గ్రంథవివరణ పట్టికలు :

గ్రంథాలయములలో మొదటిశ్రేణికి చెందినవాని కుపయోగించు నట్లు కార్యదర్శిచే తయారుచేయబడిన గ్రంథవివరణపట్టికల నచ్చు వేయించి కావలసిన గ్రంథాలయములకు విక్రయించబడెను. 5000 పుస్త కముల వ్రాయుటకు సరిపోవు నీ పట్టికకు రు 6/- ధర నిర్ణయించితిమి.

గ్రామగ్రంథాలయముల నిమిత్తము తెనాలితాలూకా గ్రంథా లయసంఘమువారు లోగడ నచ్చువేయించిన గ్రంథవివరణ పట్టికలకై కొందరడుగుచున్నందున వానిని మొత్తముగ నచ్చువేయించియు, వానితోపాటు అవసరమైన ఇతరపట్టికలను కూడ తయారుచేయించియు, అన్నిగ్రంథాలయములవారు నొకేవిధమైన రికార్డుల నమలులో నుంచు నట్లు చేయుటవసరము. త్వరలో నీప్రయత్నమున కీసంఘము పూన వలసియున్నది.

గ్రంథముల జాబితాలు :

వివిధవిషయములకు సంబంధించిన గ్రంథపట్టికల మనము ప్రక టించుచో గ్రంథాలయనిర్వాహకులు తమ తమ గ్రంథాలయముల కను కూలించు పుస్తకములను సులభముగ నిర్ణయించుకొనుటకు వీలుగ

నుండును. ఇట్టిపట్టికల ప్రకటించుటలో గ్రంథములనుగూర్చిన గ్రంథకర్త, ప్రకాశకులు, విషయము, వెల, దొరకుచోటు మొదలుగాగల వివరముల ముఖ్యముగ నిచ్చుటవసరము. వ్యయప్రయాసలతో కూడినదయ్యు నీకార్యక్రమమును మనసంఘము త్వరలో చేపట్టవలసియున్నది.

గ్రంథప్రకటన:

శిక్షణతరగతులకు పాఠ్యగ్రంథములుగను, గ్రంథాలయనిర్వాహకులకు సహాయకరములుగనునుండి గ్రంథాలయనిర్వహణకు సంబంధించిన పుస్తకములను, గ్రంథాలయముల కవసరమైన అచ్చులోలేని వివిధవిషయములనుగూర్చిన ఆధునికగ్రంథములను, స్త్రీలు, పిల్లలు మొదలుగాగల ప్రత్యేకవర్గములకుచెందిన వారి కుపకరించు పొత్తములను ప్రవీణులచే తెలుగున వ్రాయించి సంఘపక్షమున ప్రకటించుటకును మనము పూనవలసియున్నది.

## ఇతరసంఘముల సంబంధము

భారతగ్రంథాలయసంఘ (ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్) కార్యదర్శిగారు తమ 2-9-38 వ తేదీ జాబులో 1937-38 వ సం॥ నకు చందా చెల్లించని కారణమున మన సంఘముపేరును తమ సభ్యుల పట్టికనుండి తొలగించినట్లు తెలిపియున్నారు. వచ్చే సంవత్సరములో నీసంఘముతో నుత్తరప్రత్యుత్తరముల జరిపి మన సభ్యత్వమును పునరుద్ధరించుకొనుటవసరము.

వంగీయగ్రంథాలయ పరిషత్తు (బెంగాల్ లైబ్రరీ అసోసియేషన్) వారు తమసంఘప్రచురములనన్నిటిని ఇచ్చిపుచ్చుకోలు (Exchange) పద్ధతిపై మన సంఘమునకు పంపుట కొడంబడి తమ తీర్మానమును వ తేదీ జాబుద్వారా తెలిపియున్నారు.

1939 జనవరిలో మద్రాసునందు జరిగిన దక్షిణభారత వయోజన విద్యామహాసభ కీ సంఘపక్షమున ప్రతినిధులుగ నెన్నుకొనబడిన వారిలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అయ్యంకి

వెంకటరమణయ్యగార్లు హాజరైరి. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు 'వయోజనవిద్యావిషయమై ఆంధ్రదేశగ్రంథాలయములు చేయుచున్న కృషి.'ని గూర్చి పై సమావేశములో లిఖితపూర్వకముగా నొక యుపన్యాసము నొసంగిరి. ఈ సమావేశఫలితముగ నేర్పడిన దక్షిణ భారత వయోజనవిద్యాసంఘమునకు మన అధ్యక్షులు శ్రీ హరిసర్వోత్తమరావుగారు పాధ్యక్షులుగ నెన్నుకొనబడుట చాల సంతోషవిషయము.

## సలహాకేంద్రము - కార్యాలయప్రయత్నము

ఈ సంఘపక్షమున నివేదికకాలములో వివిధప్రదేశములగల గ్రంథాలయముల నిర్వాహకులు కోరినసలహాలు పంపబడెను. కొన్నింటికి గ్రంథపట్టికలు, కొన్నింటికి రిజస్టరుచేయుటకు వలయు మాదిరి నిబంధనలు ముఖ్యముగ వ్రాసి పంపబడెను. సంఘకార్యాలయమున కొకస్థిర వసతి, దానిని నడపుటకు వలయుసిబ్బంది యున్నచో నీవిధమైనసలహాలిప్పటికంటె చక్కగ నెక్కువగ నెప్పటికప్పుడు పంపుచుండవచ్చును. ఈవిషయమును గమనించియే సంఘాదర్శములలో ప్రధానమైన కేంద్ర గ్రంథాలయ నిర్మాణమునకును, సంఘకార్యాలయపు టేర్పాటుకును అనుకూలించునట్లు నివేదికకాలములో బెజవాడ—బందరు రోడ్డుప్రక్కన బెజవాడ మునిసిపల్ సరిహద్దు నానుకొనియున్న ఒక ఎకరముభూమిని రు 1800/- లకు కొంటిమి. త్వరలో దీనియందొకప్రక్క కార్యాలయ భవనమును నిర్మించునిమిత్తము 14-4-39 వ తేదీ సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిచే శంకుస్థాపన చేయించితిమి. భవన నిర్మాణమును పూర్తిచేయుటకై ఉపసంఘమొకటి నియమింపబడినది. ఈఉపసంఘసభ్యులపట్టిక అనుబంధము ౬ లో చూడనగును. పై స్థలమునకు దారినిమిత్తము సుమారు 10 సెంట్ల స్థలమునిచ్చుటకు శ్రీ కానూరి సుబ్బయ్య, పున్నయ్య, బాపయ్యగార్లు (పటమటలంక) అంగీకరించిరి.

పై స్థలము ఖరీదులో రు 1000/- లు శ్రీ కొమ్మా సీతారామయ్యగారిచ్చినట్లు పైనచెప్పియుంటిని. తక్కిన రు 800/- లును భవన

నిర్మాణమునకు కావలసిన సుమారు రు 2200/- లును మనకు వెంటనే వసూలుకావలసియున్నది. దైవానుగ్రహమున నీమొత్తమును మనము సులభముగా సంపాదింప గలుగుదుమని ఆశించుచున్నాను. విజ్ఞానప్రచారకోద్యమముపట్ల ఆదరాభిమానములుగల ఆంధ్రపుత్రులు దేశమున నెక్కువగ నుండుటయే దీనికి కారణము.

## భవిష్యత్కార్యక్రమము

ఇంతవరకును గత సంవత్సరములో మన సంఘపక్షమున నడచిన కార్యక్రమమును గూర్చి నివేదించితిని. ఇరువదైదేడులుగ చాల పనుల నీసంఘమొనర్చియున్నను ఉద్యమాదర్శమును మనము చేరవలెనన్న ఇంకను చేయవలసిన కార్యక్రమమనంతముగ నున్నది. మన ప్రచారము పూర్తిగ సాగవలెనన్న దేశము నలుమూలల శాఖాసంఘముల స్థాపించి, గ్రంథాలయయాత్రల సాగించుచు, అన్నిప్రాంతములలోను గ్రంథాలయస్థాపన, పోషణలను ప్రోత్సహించుట ముఖ్యము. గ్రంథాలయసేవకులకు శిక్షణయు, పత్రికాప్రకటనమును దీనికి మంచిదోహదములుగ నుండగలవు. మరియు నడుగువారికి గ్రంథాలయనిర్వహణ విషయమై కావలసిన సలహాల సక్రమముగ నిచ్చుటకై గ్రంథాలయ నిర్వహణానుభవము, గ్రంథాలయశాస్త్ర జ్ఞానముగల వారొకరు కార్యాలయమున నుండుటయు నవసరము. ఈధర్మము సరిగ నిర్వర్తింపబడవలెనన్న గ్రంథాలయశాస్త్రమునకు, ఇతరవిజ్ఞానమునకు సంబంధించిన గ్రంథాలయమొకటి మనము చేర్చవలసియున్నది. దీనికి మంచి మంచిపుస్తకములు, పత్రికలు సంపాదించవలసియున్నది. ఇదియే క్రిమముగ ఆంధ్రదేశమున కంతటికి నీకేంద్రగ్రంథాలయము కాగలదు. ఇందే నెమ్మదిగ పండితులకు, పరిశోధకులకు, గ్రంథాలయవిద్యార్థులకు వలయు సౌకర్యములచే కూర్చవచ్చును. ఇంతేగాక, నివేదికలో పైన సూచించబడిన వివిధములగు ప్రచురణలకూడ మనము త్వరలో చేపట్టవలసియున్నది. ఉద్యమవ్యాప్తికై తెలుగుదేశమంతయు మనము తిరుగుటయు ముఖ్యముగ చేయవలసియున్నది.

# విజ్ఞప్తి

ఇవియన్నియు సక్రమముగ సాగుటకు ధనము మిగులనవసరము. విజ్ఞానవంతులెల్లరు నీసంఘమున సభ్యులుగజేరి, ఉదారులు దీనికి విరివిగ విరాళములనిచ్చి, స్థానికసంస్థలు, సహకారసంఘములు దీనికార్యక్రమమునకు అన్నివిధముల సాయపడుచో మనకు డబ్బులోటుండదు. అప్పుడు పనియు చరచరసాగును. ఆంధ్రులు కార్యశూరులుకారనువాద మదృశ్యమై గ్రంథాలయలోకములో భారతదేశమున మనసంఘము ముందుండి తన పూర్వమార్గదర్శిత్వమును నిలబెట్టుకొనును. ఇందుకు విజ్ఞానధనులగు ఆంధ్రపుత్రులెల్లరుపూని పనిచేయ మనవి.

కార్యస్థానము :
పటమటలంక—బెజవాడపోస్టు

ఇట్లు
పాతూరి నాగభూషణం
కార్యదర్శి

అనుబంధము ౧.

# 1938 – 39 సం॥ సంఘసభ్యుల పట్టిక

## మహారాజపోషకులు

1. శ్రీ కొమ్మా సీతారామయ్యగారు, పటమటలంక, బెజవాడపోస్టు

## సాధారణసభ్యులు

విశాఖపట్టణముజిల్లా :

1. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు
తెనుగుగుడి, విశాఖపట్టణము

తూర్పుగోదావరిజిల్లా :

2. శ్రీ కాశీపట్నపు కొండయ్యగారు
'విజ్ఞానం' సంపాదకులు, రాజమహేంద్రవరము
3. ,, వేమూరి నాగేశ్వరరావుగారు, ఇన్నీసుపేట, డిటో
4. ,, చొప్పర్రి రామకృష్ణరావుగారు, వీరభద్రపురము, డిటో
5. ,, మహీధర రామమోహనరావుగారు
ముంగండ (వయా) అంబాజీపేట

పశ్చిమగోదావరిజిల్లా :

6. శ్రీ తాడిమేటి కుటుంబశాస్త్రిగారు, నిడదవోలు
7. ,, మునిపల్లె కేశవరావుగారు, హెల్తుఇన్స్పెక్టరు, తాడేపల్లిగూడెం
8. ,, తొంగలి గజపతిరాయవర్మగారు, తాడేపల్లిగూడెము
9. ,, రెడ్డివారి నారాయణరెడ్డిగారు
వెటర్నరీడాక్టరు, తాడేపల్లిగూడెము
10. ,, దామెర రామారావుగారు, జగన్నాథపురం, మాధవరంపోస్టు

కృష్ణా జిల్లా :

11. శ్రీ గరికిపాటి కృష్ణమూర్తిగారు, నందిగామ
12. ,, కాట్రగడ్డ నారాయణరావుగారు, యం. యల్. ఏ.
మొగల్రాజపురం, బెజవాడపోస్టు
13. ,, రామినేని రాఘవయ్యగారు, పటమట, బెజవాడపోస్టు
14. ,, కాట్రగడ్డ రాజగోపాలరావుగారు,
జమీగొల్వేపల్లి (వయా) పామర్రు
15. ,, యద్దనపూడి రామబ్రహ్మంగారు, నందిగామ
16. ,, కుందా లక్ష్మీనరసయ్యగారు,
ఆంధ్రగ్రంథాలయప్రెస్, బెజవాడ
17. ,, ఈడుపుగంటి వేంకటనారాయణగారు, పెనమకూరు
18. ,, అయ్యంకి వెంకటరత్నంగారు,
ఆంధ్రగ్రంథాలయప్రెస్, బెజవాడ.
19. ,, సూరపనేని వెంకటరత్నంగారు, పెడసనగల్లు, దివితాలూకా
20. ,, ఈడుపుగంటి వేంకటరత్నమాంబగారు,
పెనమకూరు, బెజవాడతాలూకా
21. ,, పొట్టి వెంకటసుబ్బయ్యగారు,
భ్రమరాంబామల్లేశ్వర గ్రంథాలయము, బెజవాడ
22. ,, వల్లూరు వెంకటసుబ్బయ్యగారు, పటమటలంక, బెజవాడపోస్టు
23. ,, వీరమాచనేని శివరామకృష్ణయ్యగారు,
ఈడుపుగల్లు, బెజవాడతాలూకా
24. ,, మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ.

గుంటూరుజిల్లా :

25. శ్రీ కొడాలి ఆంజనేయులుగారు, తెనాలి
26. ,, మందలపర్తి ఉపేంద్రశర్మగారు, హిందూకళాశాల, గుంటూరు
27. ,, యక్కల కనకయ్యగుప్తగారు, నరసరావుపేట
28. ,, పెమ్మసాని కమలేశ్వరరావుగారు, చినపాలెం, పేరకలపూడిపోస్టు
29. ,, కస్తూరి కుటుంబరావుగారు, కనగాల (వయా) తెనాలి
30. ,, వెన్నం కోటయ్యగారు, రావికంపాడు, కొల్లూరుపోస్టు

31. శ్రీ మర్రెడ్డి గురవారెడ్డిగారు, తూములూరు, కొల్లిపరపోష్టు
32. ,, తుమ్మల గోపాలకృష్ణయ్యగారు, కూచిపూడి, తెనాలితాలూకా
33. ,, వాశిలాల గోపాలకృష్ణయ్యగారు, సత్తెనపల్లి
34. ,, వూటుకూరు జయరాందాసుగారు

వేటపాలెము, బాపట్లతాలూకా

35. శ్రీ రామినేని నారాయణగారు, బ్రాహ్మణకోడూరు
36. ,, అచ్యుతుని పిచ్చయ్యశర్మగారు,

తిమ్మసముద్రము (వయా) వేటపాలెము

37. ,, మాజేటి పూర్ణచంద్రరావుగారు, నరసరావుపేట
38. ,, గోరంట్ల పెదవీరయ్యగారు,

తిమ్మసముద్రము (వయా) వేటపాలెము

39. ,, క్రొత్తపల్లి ప్రకాశరావుగారు, మోపర్రు (వయా) తెనాలి
40. ,, చావలి బాలసుందరరావుగారు, నిజాంపట్నము
41. ,, పాటిబండ్ల రంగనాయకులుగారు, భీమవరం, ఇంకొల్లుపోస్టు
42. ,, పుణ్యమూర్తుల రాజశేఖరంగారు, బ్రాడీపేట, గుంటూరు
43. ,, పరుచూరి రామకృష్ణయ్యగారు, అమృతలూరు
44. ,, చదలవాడ రామయ్యగారు,

పాంచాలవరం, అమృతలూరుపోస్టు

45. ,, శరణు రామస్వామిచౌదరిగారు, అమృతలూరు
46. ,, యడ్లపాటి లక్ష్మణస్వామిగారు, యలవర్రు, తెనాలితాలూకా
47. ,, తాడేపల్లి లక్ష్మీకాంతారావుగారు, పెదపాలెం(వయా)దుగ్గిరాల
48. ,, శరణు లక్ష్మీనారాయణగారు

పాంచాలవరము, అమృతలూరుపోష్టు

49. ,, వుప్పల వెంకటకృష్ణయ్యగారు, బ్రాహ్మణకోడూరు
50. ,, మాలెంపాటి వెంకటనరసయ్యగారు, పెదపాలెము
51. ,, జంపాల వేంకటనృసింహముగారు, దుగ్గిరాల
52. ,, కుర్రె నాగిరెడ్డిగారి కు॥ వెంకటరెడ్డిగారు

రామచంద్రపురము, పెదవడ్లపూడిపోష్టు

53. శ్రీ మంతెన వెంకట్రామరాజుగారు
మంతెనవారిపాలెము (వయా) పొన్నూరు
54. ,, గోగినేని వెంకటసుబ్బయ్యగారు, ఈతేరు, అప్పికట్లపోష్టు
55. ,, నాగినేని వెంకయ్యగారు, ధేరువుకొండ, అనమంచూరుపోష్టు
56. ,, పుతుంబాక శ్రీరాములుగారు, పెదపాలెం (వయా) దుగ్గిరాల
57. ,, వెలువోలు సీతారామయ్యగారు, అమృతలూరు
58. ,, మేడిశెట్టి సుబ్బయ్యగారు, భారతీప్రెస్, తెనాలి
59. ,, గళిని సూర్యనారాయణగారు, న్యూస్‌ఏజంటు, పొన్నూరు
60. ,, పాటిమళ్ళ స్వామినాయుడుగారు, నరసరావుపేట

నెల్లూరుజల్లా :

61. శ్రీ చుండూరు కన్నయ్యశ్రేష్ఠిగారు, నవాబుపేట, నెల్లూరు
(రు 2/- చెల్లించిరి)

చెన్నపట్టణము:

62. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు,
9 సుంకువారివీధి, ట్రిప్లికేను, మదరాసు

కర్నూలుజిల్లా :

63. శ్రీ కందుల ఓబుళరెడ్డిగారు, కంభంపోస్టు, కర్నూలుజిల్లా

## గౌరవసభ్యులు

1. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు, బెజవాడ
(ఆం. దే. గ్రం. సంఘస్థాపకులు)

## గ్రంథాలయములు & పఠనమందిరములు

పశ్చిమగోదావరిజిల్లా : తాడేపల్లిగూడెముతాలూకా

1. అలంపురము : పంచాయతీగ్రంథాలయము
2. ఆరుతీగపాడు : శ్రీకృష్ణాగ్రంథాలయము
3. ఆరుగొలను : శ్రీవేంకటరమణగ్రంథాలయము

4. కస్పాపెంటపాడు : శ్రీసుబ్రహ్మణ్యగ్రంథాలయము
5. కేశవరము : జిల్లాబోర్డుగ్రంథాలయము
6. కొండేపాడు : శ్రీసుబ్రహ్మణ్యగ్రంథాలయము
7. కోనాల : శ్రీనాగేశ్వరగ్రంథాలయము
8. కోరుమిల్లి : శ్రీసరస్వతీగ్రంథాలయము
9. కృష్ణాయపాలెము : పంచాయతీగ్రంథాలయము
10. చింతపల్లి : శ్రీభీమేశ్వరగ్రంథాలయము
11. చెరుకుగనుమ : శ్రీచంద్రశేఖరగ్రంథాలయము
12. జగన్నాథపురము : శ్రీమల్లేశ్వరగ్రంథాలయము
13. దండగర్ర : శ్రీకృష్ణాగ్రంథాలయము
14. దరిశిపర్రు : శ్రీసర్దారుగ్రంథాలయము
15. నందమూరు : శ్రీ వేంకట్రామగ్రంథాలయము
16. నవాబుపాలెము : పంచాయతీగ్రంథాలయము
17. పడమరవిప్పర్రు : శ్రీ వివేకానందగ్రంథాలయము
18. పెంటపాడు : శ్రీనివాసగ్రంథాలయము
19. పెదసింద్రకొలను : పంచాయతీగ్రంథాలయము
20. ప్రత్తిపాడు : శ్రీరామమోహనగ్రంథాలయము
21. బోడపాడు : పంచాయతీగ్రంథాలయము
22. మీనవల్లూరు : శ్రీ తిక్కనగ్రంథాలయము
23. ముద్దాపురము : శ్రీ సీతారామగ్రంథాలయము
24. రాచెర్ల : శ్రీ రామదాసుగ్రంథాలయము
25. రావిపాడు : శ్రీ రామలింగేశ్వరగ్రంథాలయము
26. వల్లూరుపల్లి : శ్రీ నాగేశ్వరగ్రంథాలయము

కృష్ణాజిల్లా : గుడివాడతాలూకా

27. యలమర్రు : శ్రీదయానందగ్రంథాలయము

గన్నవరంతాలూకా :

28. కానుమోలు : శ్రీహనుమత్పుస్తకభాండాగారము
29. తేలప్రోలు : శ్రీ వేమనగ్రంథాలయము

తిరువూరుతాలూకా :

30. తునికిపాడు : శ్రీసీతారామరాజుగ్రంథాలయము
(పెంగొలనుపోస్టు)

దివితాలూకా

31 పెదసనగల్లు : శ్రీశివరామప్రసాదపుస్తకభాండాగారము

నందిగామతాలూకా

32. కొణకంచి : శ్రీరామచంద్రబాలభక్తగ్రంథాలయము

బెజవాడతాలూకా :

33. గుణదల : గుణదల ఖద్దరుసంస్థానగ్రంథాలయము
34. తెన్నేరు : శ్రీగాంధీగ్రంథాలయము
35. పటమట : శ్రీఅచ్చయ్య ధర్మగ్రంథాలయము
36. పటమటలంక : శ్రీమహాత్మాగాంధీ ధర్మపుస్తకభాండాగారము
37. బెజవాడ : బెజవాడ విద్యార్థిసంఘగ్రంథాలయము
38. బెజవాడ : శ్రీభ్రమరాంబామల్లేశ్వరాంధ్రగ్రంథాలయము
39. మైలవరం : శ్రీమహాత్మాగాంధీగ్రంథనిలయము

గుంటూరుజిల్లా : గుంటూరుతాలూకా

40. కృష్ణాయపాలెము : నవీనాదర్శగ్రంథాలయము
41. చిర్రావూరు : శ్రీ జితేంద్రనాథగ్రంథాలయము
42. యేటుకూరు : హరిజనోద్ధారకగ్రంథాలయము

తెనాలితాలూకా :

43. అమృతలూరు : భాషాసంజీవినీసంఘము
44. కూచిపూడి : శ్రీ సరస్వతీనిలయము
45. కొల్లిపర : శ్రీ వాణీవిలాసగ్రంథాలయము
46. గోడవర్రు : శ్రీ పటేల్ పఠనమందిరము
47. చినపాలెము : శ్రీ తిలక్ జాతీయపుస్తకభాండాగారము
48. చుండూరు : శ్రీ దాదాభాయినౌరోజీగ్రంథాలయము
49. తూములూరు : శ్రీ కమలానెహ్రూగ్రంథాలయము

50. పెదపాలెము : ఆర్యబాలసమాజము
51. ,, : సేవాశ్రమవాణీమందిరము
52. మోపర్రు : శ్రీనాధగ్రంథాలయము
53. మోరంపూడి : శ్రీవిద్యాభిలాషిణీసంఘము
54. రావికంపాడు : శ్రీరామకృష్ణగ్రంథాలయము
55. రేవేంద్రపాడు : శ్రీ వీరేశలింగపుస్తకభాండాగారము
56. వామనగుంటపాలెము : శ్రీసారస్వతనిలయము
57. శృంగారపురము : శ్రీజ్ఞానదాయినీపుస్తకభాండాగారము
58. సంగంజాగర్లమూడి : శ్రీసర్వజన విద్యాప్రదాయిని పుస్తకభాండాగారము

బాపట్లతాలూకా:

59. నిడుబ్రోలు : శ్రీరంగాగ్రంథాలయము
60. మంతెనవారిపాలెము : ఆంధ్రరత్నగ్రంథాలయము
61. చినగంజాం : శ్రీకన్యకాపరమేశ్వరీ గ్రంథాలయము
62. సంతరావూరు : శ్రీసరస్వతీగ్రంథాలయము
63. వేటపాలెము : శ్రీసారస్వతనికేతనము

నిజామురాజ్యము:

64. ఖమ్మంమెట్టు : శ్రీవిజ్ఞాననికేతనము

## శాఖాసంఘములు

పశ్చిమగోదావరిజిల్లా :

1. తాడేపల్లిగూడెం తాలూకాగ్రంథాలయసంఘము
తాడేపల్లిగూడెము
కార్యదర్శి : శ్రీ ధూళిపాళ్ల సత్యనారాయణగారు

కృష్ణాజిల్లా :

2. దివితాలూకా గ్రంథాలయసంఘము
మాజేరు, చల్లపల్లిపోష్టు
కార్యదర్శి : శ్రీ మాజేటి రామచంద్రరావుగారు

గుంటూరుజిల్లా :

3. తెనాలితాలూకా గ్రంథాలయసంఘము, చుండూరు

కార్యదర్శి : శ్రీగుండవరపు వేంకటేశ్వర్లుగారు

## సహకార పరపతిసంఘము

కృష్ణా జిల్లా :

1. వీరవల్లి సహకారపరపతిసంఘము, వీరవల్లి, గన్నవరంతాలూకా

అనుబంధము ౨.

# ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము - బెజవాడ

## సంఘోద్దేశముల మార్పుకై సూచనలు

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమవ్యాప్తికై క్రిందిసాధనముల ద్వారాను, ఇందులకు విరుద్ధముగాని ఇతరసాధనములద్వారాను కృషి చేయుట ఈసంఘోద్దేశమైయున్నది.

1. ఆంధ్రదేశమందంతటను గ్రంథాలయములను, పఠనమందిరములను విరివిగాస్థాపించుట, వాని నీసంఘమున సభ్యులుగ జేర్చుకొనుట.

2. బెజవాడ పట్టణమున ఆంధ్రదేశమున కంతటికిని ఒక కేంద్ర గ్రంథాలయమును, దాని కనుబంధముగ గ్రంథాలయముల నిర్వహణ విషయమై సలహాలనిచ్చు నిమిత్తమొక సమాచార కేంద్రమును (Information Bureau) నిర్వహించుట.

3. ఆంధ్రదేశము నలుమూలల గ్రంథాలయోద్యమాభివృద్ధికై కృషిచేయునిమిత్త మీసంఘమున కన్నిప్రాంతముల శాఖాసంఘముల నేర్పాటుచేయుట.

4. ఉపన్యాసములు, కరపత్రములు, పత్రికలు, ప్రదర్శనములు మున్నగు సాధనములద్వారా జనసామాన్యమునందు విజ్ఞానవ్యాప్తిని గ్రంథాలయప్రబోధమును గావించుట.

5. జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధిని కలిగించుటకు సాధనములుగానుండు జాతీయసంస్థాపనలను కాలానుసరణముగ నుద్ధరించుట.

6. గ్రంథాలయముల కవసరమైన సకలవిధ గ్రంథములను వివిధవిషయములనుగూర్చిన గ్రంథపట్టికలను, రిజిష్టర్లు వగైరా పరికరములను తయారుచేయించి ప్రకటించుట. వాని ప్రకటనకై సహాయపడుట.

7. సుశిక్షితులగు గ్రంథభాండాగారులను తయారుచేయుట.

8. గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడునట్టి శాసననిర్మాణమునకై కృషిసల్పుట.

9. సంఘాభివృద్ధికిని, వ్యక్తివికాసమునకును సాధనభూతములైన సారస్వత, వైజ్ఞానిక, చారిత్రకాది పరిశోధనల ప్రోత్సహించుట.

10. ఈ సంఘోద్దేశములు గలిగిన ఇతరసంఘములతో కలసి పనిచేయుట, అట్టివానితో సంబంధమును కలుగజేసికొనుట.

11. ఇందునిమిత్తమవసరమైన ధనమును, స్థిరచరాస్తులను సంపాదించుట, వినియోగించుట.

పా. నాగభూషణం,

కార్యదర్శి

## అనుబంధము 3. కార్యదర్శి చేసిన గ్రంథాలయోపన్యాసములు :

| తేదీ | స్థలము. | సందర్భము. | ప్రసంగవిషయము. |
|---|---|---|---|
| 3- 8-38 | జువ్వలపాలెం, భీమవరంతా॥ | శ్రీరామమోహన గ్రంథాలయ వార్షికోత్సవము | వివిధదేశములందలి గ్రంథాలయ సంఘముల కార్యక్రమము |
| 4- 8-38 | కలవలపూడి | భీమవరం తాలూకా గ్రంథాలయయాత్ర | గ్రంథాలయోపయోగములు |
| 5- 8-38 | అయభీమవరం | శ్రీనారాయణరాజు గ్రంథాలయ వార్షికోత్సవము | గ్రంథాలయసూత్రములు |
| 6- 8-38 | కుముదవల్లి | భీమవరం తాలూకా గ్రంథాలయయాత్ర | ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము |
| 13- 8-38 | కోరుమిల్లి | శ్రీసరస్వతీ గ్రంథాలయభవన ప్రవేశము | ఆదర్శపౌరగ్రంథాలయము, గ్రంథాలయ ముఖ్యాంగములు |
| 15-10-38 | తాడేపల్లిగూడెం తాలూకా దర్శిపఱ్ఱు | సర్దారు గ్రంథాలయప్రారంభము | గ్రంథాలయసూత్రములు |
| 20-11-38 | కనగాల, రేపల్లె తాలూకా | శ్రీజాతీయ బాలభారతీ గ్రంథనిలయ వార్షికోత్సవము | *"గ్రంథాలయవిధానములు" |

| తేదీ. | స్థలము. | సందర్భము. | ప్రసంగవిషయము. |
|---|---|---|---|
| 29-12-38 | ఈపూరు, తెనాలి తా॥ | శ్రీరాధాకృష్ణగ్రంథాలయ వార్షికోత్సవము | గ్రంథాలయోపయోగములు |
| డిసెం॥ 38 | క్రాప | శ్రీసుజనవిధేయసమాజ గ్రంథాలయమువారి ప్రత్యేకాహ్వానము | *'ఆధునికగ్రంథాలయపరిణామము' |
| 6. 1-39 | నరసరావుపేట, డిటో తా॥ | శ్రీవైశ్యబాలమిత్ర గ్రంథాలయ వార్షికోత్సవము | గ్రంథాలయనిర్వహణము |
| 7- 1-39 | జొన్నలగడ్డ | గ్రామపంచాయతీబోర్డు గ్రంథాలయ వార్షికోత్సవము | అమెరికాదేశ గ్రంథాలయము |
| ,, | కనుపర్రు | శ్రీగాంధీసారస్వతనిలయ వార్షికోత్సవము | గ్రంథాలయసూత్రములు |
| మార్చి 39 | దుగ్గిరాల, తెనాలి తా॥ | హైస్కూలు హిందీమిత్రమండలి వార్షికోత్సవము | విద్యాలయము—గ్రంథాలయము |
| 26- 3-39 | అంగలకుదురు | తెనాలి తా॥ గ్రంథాలయసంఘ కార్యదర్శిగారి ఆహ్వానము | గ్రంథాలయోపయోగములు |
| 27- 3-39 | ఈడుపుగల్లు, బెజవాడ తా॥ | యువజన గ్రంథాలయమువారి ప్రత్యేకాహ్వానము | డిటో |

| | | | |
|---|---|---|---|
| 9- 4-39 | చుండూరు, తెనాలితా॥ | 8వ తెనాలితాలూకా గ్రంథాలయ మహాసభ | గ్రంథాలయ వార్షికోత్సవములు |
| 10- 4-39 | మండూరు | తె. తా. గ్రం. సంఘము అమృతలూరుఫిర్కా-యాత్ర | *గ్రంథాలయ విధానములు |
| 11- 4-39 | కోరుతాడిపర్రు | డిటో | గ్రంథాలయోపయోగములు |
| ,, | తురుమెళ్ళ | డిటో | ఆం. దే. గ్రం. సంఘకార్యక్రమము<br>*గ్రంథాలయపరిణామము |
| 14- 4-39 | పటమటలంక, బెజవాడతా॥ | బెజవాడ తా. గ్రం. మహాసభ | ఆం. దే. గ్రం. సంఘకార్యక్రమము |
| 16- 4-39 | ఆలూరు, తెనాలి తా॥ | తె. తా. గ్రం. సంఘము అమృతలూరుఫిర్కా-యాత్ర | గ్రంథాలయోపయోగములు |
| ,, | కొండముది | డిటో | దేవాలయము—గ్రంథాలయము |
| 25- 4-39 | వల్లూరు, తా. గూడెం తా॥ | తాడేపల్లిగూడెం తాలూకా గణపవరంఫిర్కా-యాత్ర | గ్రంథాలయోపయోగములు |
| ,, | పిప్పర | డిటో | గ్రంథాలయోపయోగములు & గ్రంథాలయాభివృద్ధికి భవననిర్మాణావసరము |

| తేది. | స్థలము. | సందర్భము. | ప్రసంగవిషయము. |
|---|---|---|---|
| 26- 4-39 | కాకినాడ | తాడేపల్లిగూడెం తాలూకా గణపవరంఫిర్కా యాత్ర | "మనుష్యజీవితములో" వార్తాపత్రికల ముఖ్యావసరము |
| 27- 4-39 | అర్ధవరం | డిటో | స్థానికగ్రంథాలయాభివృద్ధి |
| ,, | కొత్తపల్లి | డిటో | "దేవాలయము—గ్రంథాలయము" |
| 28- 4-39 | బువ్వనపల్లె | డిటో | విద్యాదానప్రాశస్త్యము—గ్రంథాలయములందుంచదగు గ్రంథములు |
| 29- 4-39 | సరిపెల్ల | డిటో | పఠనాలయనిర్వహణము |
| ,, | గణపవరం | 6వ తా. గ్రం. మహాసభ అధ్యక్షోపన్యాసము | గ్రంథాలయాభివృద్ధికి ప్రస్తుతమున్న ఆటంకములు, వానినివారణోపాయములు |

* ఈగుర్తుగలవి మ్యాజికులాంతరు సహాయముతో గావించిన ఉపన్యాసములు.

అనుబంధము ౪.

## కార్యదర్శి దర్శించిన గ్రంథభాండాగారములు

పశ్చిమగోదావరిజిల్లా : ఏలూరుతాలూకా

1. ఏలూరు : హిందూయువజనసంఘము

కొవ్వూరుతాలూకా

2. కొవ్వూరు : ఆంధ్రగీర్వాణ విద్యాపీఠగ్రంథాలయము
3. ,, : జిల్లాబోర్డుగ్రంథాలయము

తణుకుతాలూకా

4. తణుకు : శ్రీరామపుస్తకభాండాగారము
5 ,, : శ్రీహార్డింజ్ హాల్ క్లబ్ లైబ్రరీ
6. తేతలి : శ్రీరాజేశ్వర గ్రంథాలయము

తాడేపల్లిగూడెం తాలూకా

7. కేశవరము : జిల్లాబోర్డుగ్రంథాలయము
8. గణపవరము : శ్రీనాగేశ్వరగ్రంథాలయము,
9. తాడేపల్లిగూడెం : జిల్లాబోర్డుగ్రంథాలయము
10. దర్శిపర్రు : శ్రీసర్దార్ గ్రంథాలయము
11. రావిపాడు : శ్రీరామలింగేశ్వరగ్రంథాలయము
12. సరిపల్ల : శ్రీరాజేశ్వరగ్రంథాలయము

భీమవరంతాలూకా

13. అయభీమవరం : శ్రీనారాయణరాజుగ్రంథాలయము
14. ఆకివీడు : శ్రీవిద్యానందయువజనగ్రంథాలయము
15. కుముదవల్లి : శ్రీవీరేశలింగకవిసమాజగ్రంథాలయము
16. చెరుకుమిల్లి : శ్రీకృష్ణదేవరాయగ్రంథాలయము
17. జువ్వలపాలెము : శ్రీరామమోహనగ్రంథాలయము

18. పాందువ్వ : శ్రీరామసుబ్బరాజేంద్రగ్రంథాలయము
19. పాలకోడేరు : శ్రీమహాదేవరెనడేగ్రంథాలయము

నరసాపురంతాలూకా

20. పాలకొల్లు : శ్రీపానకాలరాయ రామమోహనక్లబ్
21. ,, : మునిసిపల్ లైబ్రరీ

కృష్ణాజిల్లా : బెజవాడతాలూకా

22. ఈడుపుగల్లు : యువజనగ్రంథాలయము
23. పటమట : శ్రీఅచ్చయ్యధర్మగ్రంథాలయము
24. పటమటలంక : శ్రీమహాత్మాగాంధీ ధర్మపుస్తకభాండాగారము
25. బెజవాడ : ప్రకృతికార్యాలయట్రస్టులైబ్రరీ
26. ,, : బెజవాడవిద్యార్థిసంఘగ్రంథాలయము
27. ,, : శ్రీరామమోహన ధర్మపుస్తకభాండాగారము
28. ,, : శ్రీవెలిదెండ్ల హనుమంతరాయగ్రంథాలయము

గుంటూరుజిల్లా : గుంటూరుతాలూకా

29. గుంటూరు : శ్రీశారదానికేతనపుస్తకభాండాగారము
30. పెదవడ్లపూడి : వాణీమందిరము (సేవాశ్రమవాణీమందిరశాఖ)
31. శేకూరు : శ్రీబాలసరస్వతీగ్రంథాలయము

తెనాలితాలూకా

32. అంగలకుదురు : శ్రీ భ్రమరామల్లేశ్వరపుస్తకభాండాగారము
33. అనంతవరము : శ్రీ భారతీవిలాసవిద్యానిలయము
34. ఈపూరు : శ్రీ రాధాకృష్ణగ్రంథాలయము
35. కూచిపూడి : శ్రీ సరస్వతీనిలయము
36. క్రాప : శ్రీ సుజనవిధేయసమాజగ్రంథాలయము
37. చుండూరు : శ్రీ దాదాభాయినౌరోజీగ్రంథాలయము
38. తెనాలి : పురపాలకసంఘ సర్వజనపుస్తకభాండాగారము
39. తురుమెళ్ల : శ్రీ వివేకానందగ్రంథాలయము
40. పెదపాలెము : ఆర్యబాలసమాజము

41. పెదపాలెము : సేవాశ్రమవాణీమందిరము
42. పేరకలపూడి : శ్రీ జ్ఞానోదయగ్రంథాలయము
43. మందూరు : శ్రీ ఆంధ్రసరస్వతీగ్రంథనిలయము
44. రేవేంద్రపాడు : శ్రీ వీరేశలింగపుస్తకభాండాగారము
45. శృంగారపురము : శ్రీ జ్ఞానదాయినీపుస్తకభాండాగారము
46. వామనగుంటపాలెము : శ్రీ సారస్వతనిలయము

నరసరావుపేటతాలూకా

47. కనుపర్రు : శ్రీ గాంధీసారస్వతనిలయము
48. జొన్నలగడ్డ : గ్రామపంచాయతీబోర్డు గ్రంథాలయము
49. నరసరావుపేట : శ్రీ వైశ్యబాలమిత్ర గ్రంథాలయము

బాపట్లతాలూకా

50. నిడుబ్రోలు : శ్రీరంగాగ్రంథాలయము
51. మాచవరము : రైతుగ్రంథాలయము
52. వేటపాలెము : శ్రీసారస్వతనికేతనము

రేపల్లెతాలూకా

53. కనగాల : శ్రీజాతీయబాలభారతీగ్రంథనిలయము
54. గూడవల్లి : శ్రీనెహ్రూగ్రంథాలయము

## అనుబంధము ౫.

### కార్యదర్శి పత్రికలలో ప్రకటించిన గ్రంథాలయవ్యాసములు

| వ్యాసముపేరు | ప్రకటించినపత్రిక | తేది |
|---|---|---|
| 1. గ్రంథాలయనిబంధనలు- నిర్మాణచట్టము | ప్రజాబంధు | 3-6-38 |
| *2. గ్రంథాలయసంఘములు బ్రిటను, ఐర్లండుదేశములు | ఆంధ్రదినపత్రిక | 16-7-38 |
| *3. ఐరోపాఖండ గ్రంథాలయసంఘములు | ఆంధ్రదిన, వార పత్రికలు | 7-12-38 |
| *4. రష్యాలో గ్రంథాలయ సంఘములు | ఆంధ్రవారపత్రిక | 12.4-39 |

* 2, 3, 4 వ్యాసములకు పూర్వము "గ్రంథాలయసంఘములు" అనుశీర్షికపై క్రిందివ్యాసములు ప్రకటింపబడినవి.

1. గ్రంథాలయసంఘపు అవసరము - దాని నిర్మాణవిధానము (ఆంధ్రవారపత్రిక 3-9-38)
2. అమెరికాదేశములోని గ్రంథాలయసంఘములు (ఆంధ్రదినపత్రిక 7-5-38)
3. ఆంధ్రదేశము-గ్రంథాలయసంఘము (ప్రజాబంధు 3-7-38)

ఇందు కడపటివ్యాసమును వేటపాలెము - శ్రీసారస్వతీనికేతనము వారు కరపత్రముగ ప్రకటించిరి.

## అనుబంధము ౬.

### *భవననిర్మాణోపసంఘసభ్యులు

1. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, అధ్యక్షులు
2. ,, పాతూరి నాగభూషణంగారు, కార్యదర్శి
3. ,, కందుల ఓబుళరెడ్డిగారు, కంభం, కర్నూలుజిల్లా
4. ,, తాడిమేటి కుటుంబశాస్త్రిగారు, నిడదవోలు, పశ్చిమగోదావరి
5. ,, వింజమూరి గోవిందరాజాచార్యులుగారు, మదరాసు
6. ,, బచ్చు జగన్నాథదాసుగారు, మదరాసు
7. ,, డాక్టర్ హెచ్. వి. జోగయ్యశర్మగారు, (ఏలూరు పురపాలక సంఘాధ్యక్షులు) ఏలూరు
8. ,, డాక్టరు జంధ్యాల దక్షిణామూర్తిగారు, బెజవాడ
9. ,, డాక్టరు మూల్పూరి రంగయ్యగారు (పశ్చిమగోదావరిజిల్లాబోర్డు అధ్యక్షులు) ఏలూరు
10. ,, గద్దె రంగయ్యనాయుడుగారు, M. L. A. మదరాసు
11. ,, పుణ్యమూర్తుల రాజశేఖరంగారు, గుంటూరు
12. ,, ఉప్పుటూరి వెంకటపున్నయ్యగారు, M. L. C. గుంటూరు
13. ,, అయ్యంకి వెంకటరమణయ్యగారు, బెజవాడ

14. శ్రీ సూరపనేని వెంకటరత్నంగారు, పెదసనగల్లు, కృష్ణాజిల్లా
15. ,, ఈడుపుగంటి వెంకటరత్నమాంబగారు, పెనమకూరు, డిటో
16 ,, చుండూరు వెంకటరెడ్డిగారు, బెజవాడ
17. ,, నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారు, గుంటూరు
18. ,, వల్లూరు వెంకటసుబ్బయ్యగారు, పటమటలంక, కృష్ణాజిల్లా
19. ,, స్వామి వెంకటాచలంచెట్టిగారు, M. L. A. మదరాసు
20. ,, వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, మదరాసు
21. ,, నాగినేని వెంకయ్యగారు, ధేనువుకొండ, గుంటూరుజిల్లా
22. ,, మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ
23. ,, రావి సత్యనారాయణచౌదరిగారు, తెనాలి
(తెనాలిపురపాలక సంఘాధ్యక్షులు)
24. ,, డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు

* 13-4-39 వ తేదీ పటమటలంకలో కూడిన సంఘపాలకవర్గ సమావేశమున నీ యుపసంఘ మేర్పాటు చేయబడినది. అవసరమైన ఇతరులను చేర్చుకొనుటకు వీరికధికార మీయబడినది.

అనుబంధము ౨.

## 1938-39 వ సం|| ఆదాయవ్యయములు

| జమ రు అ పై | | ఖర్చు రు అ పై |
|---|---|---|
| 10- 0-0 | కార్యదర్శి పా. నాగభూషణం అడ్వాన్సు | |
| 1000- 0-0 | శ్రీ కొమ్మూ సీతారామయ్యగారి విరాళము | |
| 109- 0-0 | సభ్యత్వచందాలు | 7- 0-0 |
| | ప్రయాణముఖాతా | 25- 1-6 |
| | స్టేషనరీ | 7- 1-0 |
| | పోస్టేజీ | 21- 7-0 |
| | అచ్చు | 27- 5-0 |
| | ద.భా.వ. విద్యామహాసభప్రతినిధిరుసుము | 2- 0-0 |
| | స్థలమునకు అడ్వాన్సు | 1000- 0-0 |
| | కార్యదర్శి అడ్వాన్సువాపసు | 10- 0-0 |
| 1119- 0-0 | | 1099-14-6 |
| 1099-14-6 | | |
| 19- 1-6 | పోను నిల్వ | |

షరా:- కార్యాలయభవన నిర్మాణపు ఏర్పాటులు, ఆం. దే. గ్రం. పట్టిక, గ్రంథవివరణపట్టికల ఆదాయవ్యయములిందు చేరలేదు.

పా. నాగభూషణం,
కార్యదర్శి

---

భారతీప్రెస్, తెనాలి.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 104 B 114 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | B,VIIIB,X, |
| లేని పేజీలు | నో |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | KNaveen |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | నో |
| పరిస్థితి | Good |